Registered No. M-4345.

# యుద్ధ సంచిక.

వాల్యూం I.] మద్రాసు : 1941 వ సం॥ అక్టోబరు నెల 31 వ తేది శుక్రవారం [నెం 33 రు

## రాజీ సూచనలతో మోసగించుట.

### జర్మనీ క్రొత్త ఎత్తులు,

### హిట్లరు తత్వం నశిస్తేగాని యుద్ధం ముగియదని ఇంగ్లాండు-అమెరికాలు తెలిపేయి.

రాజీ కుదిరి యుద్ధం ముగిసిపోతే బాగుండునని కొన్ని వారాలనుండి వార్తలు బయలుదేరుతున్నాయి. జర్మనులు యీ ప్రచారం ప్రారంభించి ఇంగ్లాండుకి అందజేస్తున్నారు. ఈ వార్తలు జర్మనీలో పుట్టవు. జర్మనీ నుండి వస్తే ఎవ్వరు నమ్మరని, యుద్ధంలో చేరకుండా తటస్థంగావున్న దేశాలనుండి యీ వార్తలు బయలుదేరుతున్నాయి.

రష్యా ఓడిపోతున్నదని జర్మనీ సైనికాధికారుల ఉద్దేశం. ఈ సమయంలోనే యిటువంటి ప్రచారం సాగించుతే, శత్రుదేశాలు కొంచెం అశ్రద్ధగావుండి, యుద్ధ ప్రయత్నాలు తగ్గిస్తాయనీ, యీలోగా అలసియున్న జర్మను సైన్యాలకు కొంత విశ్రాంతికలిగి, తిరిగి యుద్ధానికి తగు ప్రయత్నాలు తాము చేసుకోవచ్చునని జర్మనుల ఉద్దేశం. అందుకే యిటువంటి ప్రచారం యిపుడు ప్రారంభించేరు. "రష్యాలో అమలులోవున్న బొల్షివిజం, అంటే అందరు సమానమే అనీ ధనికులు పేదవారన్న భేదముండకుండా అందరు ఒకే విధంగా దేశానికి పాటుబడి లాభాలు పొందాలను తత్వం, ఇంగ్లాండుకి కూడపడదు. జర్మనీకి మొదలేపడదు. అందుచే యిపుడా బొల్షివిజం పడిపోతున్నందున, దానిని ప్రపంచంలో లేకుండా చేయడానికి జర్మనీకి ఇంగ్లాండు ఎందుకు సహాయంచేయరాదు? ఇంగ్లాండుయొక్క సామ్రాజ్యంలో భాగాలను జర్మనీ కోరడంలేదు. ఇంగ్లాండు వలసరాజ్యాలు ఇంగ్లాండే ఉంచుకోవచ్చును. ఈ యుద్ధానికంతకు ఫ్రాంసే కారణం కనుక, ఫ్రాంసుతోనే జర్మనీకి శత్రుత్వం కనుక, ఫ్రాంసుయొక్క సామ్రాజ్య దేశాలను జర్మనీ ఇటలీ జాపానులు పంచుకుంటాయి. కనుక యుద్ధం కొనసాగించడానికి ఇంగ్లాండునకు ఎట్టి అవసరం లేదు." అని జర్మనీ ప్రచారం చేయడం మొదలు పెట్టింది.

అయితే ఏడాది క్రిందట ఫ్రాంసును లొంగదీయడానికి గూడ జర్మనీ యిట్లాగే ప్రచారం సాగించింది. ఫ్రాంసు యుద్ధం మానుకుంటే, ఫ్రాంసును అతి మర్యాదగ చూస్తామనీ, ఫ్రాంసుకి శాశ్వతంగా శాంతి చేకూరుతుందనియు వీరత్వంతో పోరాడి ఓడిన ఫ్రాంసును నీచంగా చూడమనియు, జర్మను రేడియోలో 1940 వ సం॥ జూన్ నెలలో చెప్పేరు. జర్మనీతో సంధిచేసుకున్నాక యిపుడు ఫ్రాంసు స్థితి ఎంత హీనంగావుందో, ఫ్రెంచివారు ఎంత కష్టాలుపడి బానిసత్వం అనుభవిస్తున్నారో అందరికి తెలుసు.

ఇలాగ సంధిసూచనలు, శాంతిమాటలు తాము కాస్త గెలుస్తున్నపుడల్లా చెప్పడం జర్మనీకి అలవాటే. వారిలాగ అన్నపుడల్లా ఇంగ్లాండు నిరాకరిస్తున్నది. జర్మను నాయకుల మాటలు ఎవ్వరు నమ్మరు. శాంతిరక్షణకు మంచి హామీ సైన్యాలను పెంచడమేనని వారి నమ్మకం. అందుకే వారు తిండిలేకపోయినా పరవాలేదని ఆరేళ్లాయి తుపాకులు, ఫిరంగులు తయారుచేసుకున్నారు. బలంగలవాడిదే రాజ్యం, బలంలేనివాడు అడుగునపడి చావవలసిందే అన్న సిద్ధాంతమే హిట్లరునమ్మేడు. స్పష్టంగా ఆ మాటచెప్పేడు. అట్టి రాక్షసత్వంలో నమ్మకంగలవారు యిపుడు శాంతిసూచనలు చేయడం ఎందుకో తెలుసుకోడం కష్టంకాదు. ఇంగ్లాండును మోసగించి, తప్పుదారినిపెట్టి ఏమార్చి తరువాత పడగొట్టడానికే. హిట్లరు కుడిభుజంవంటి రొడోల్ఫ్ హెస్సు ఇంగ్లాండుకి విమానంలో రావడం, పట్టిబూటకం నాటకం కాదు. 1940 వ సం॥ మే మొదలు తేదినుండి ఇంగ్లాండుపై జర్మను విమానాలు విపరీతంగా బాంబులు వేసేయి. మరునాడు హెస్సు వస్తాడనగా 10 వ తేదీన లండనుపై విపరీతంగా బాంబులువేసేయి. అందువలన బ్రిటిషువారిని భయపెట్టాలని చూసేరు. ఆ భయంతో వుండగా, హెస్సు రాజీ సూచనలు తెస్తే బ్రిటిషు ప్రభుత్వం అంగీకరించవలుస్తుందని జర్మనీనాయకుల ఉద్దేశం. ఇదికూడా యుద్ధంలో గెలవడానికి ఒక ఎత్తే అని ఒక పేర్బడ్డ గ్రంథకర్త వ్రాసేడు.

ఇపుడు రష్యాపై యుద్ధం సాగించుతున్నారు. రష్యా సైన్యాలను పడగొట్టి, రష్యాలోవున్న సంపదంతా తాము తీసుకొని, ఇంగ్లాండుచేసిన దిగ్బంధంలో లోటుతీర్చుకోవాలని జర్మనులు చూస్తున్నారు. ఆ తరువాత ఇంగ్లాండుపై మరింత బలంతో పడవచ్చునివారి వుద్దేశం. అందుకు, రష్యా ముఖ్యపట్నం అగు మాస్కోను ముట్టడిచేయడం ఒక ఎత్తు. రష్యా దక్షిణంలోవున్న కాకసను ప్రాంతాలను ఆక్రమించి అతట్టు ఇంగ్లీషువారి సహాయంరాకుండా చేయడం రెండో ఎత్తు. ఈ ప్రయత్నాలు చేస్తూవుండగానే, తటస్థదేశమగు టర్కీ రేడియోద్వారా, శాంతికుదరడానికి అవకాశాలున్నాయని, రష్యా జర్మనీలు యుద్ధం మానుతాయని, ఇంగ్లాండు జర్మనీలు సంధి చేసుకుంటాయని, ప్రచారం సాగించేరు. బ్రిటిషు సేనానాయకుడొకడు స్పెయిను ముఖ్యపట్నమగు మాడ్రిడు వెళ్లేడని, అది సంధికుదర్చడానికే అని చెప్పుతున్నారు. ఈ ప్రచారం అంతా జర్మనుల ప్రోత్సాహం వల్లనే జరుగుతున్నది.

ఇటువంటి జర్మను మోసాలకు ఇంగ్లాండు, మిత్రదేశాలు లొంగిపోవు. హిట్లరు తత్వం అంతమయ్యేవరకు రాజీకుదగదని అమెరికా అధ్యక్షుడు రూజువెల్టు స్పష్టంగా చెప్పేడు. బ్రిటిషు విదేశాంగ మంత్రి ఈడెనుగారుగూడ అలాగే ఎన్నో సార్లు చెప్పిరి. దక్షిణాఫ్రికా ప్రధానియగు స్మట్సుసేనాని కూడ హిట్లరుతో సంధికుదురుతుందనుకోడం కలలోనివార్తని చెప్పెను. రాజీ జర్మనీతో సంధికుదిరితే ఆఫ్రికాగతి అధోగతేనన్నారు. కావున జర్మనీ దురుద్దేశంతో చేస్తున్న సంధిసూచనల ప్రచారానికి ఒకటే జబాబు : విశ్వాసహీనులతో ఇంగ్లాండు అమెరికాలు రాయబారాలే జరుపవు. ఇటువంటి ప్రచారం ప్రజలలో సందేహాలు ఎక్కువచేసి గాభరాపెట్టించుటకే చేస్తున్నారని అందరు తెలుసుకోవాలి.

# విమానాలనుండి టార్పెడోలు వేయుట.

## యుద్ధనౌకల క్రొత్త ఆయుధం తాలూకు ఉపయోగం.

విమానదళంతో వెంటవుండే ఒక విలేఖరి యిట్లా వ్రాస్తున్నాడు :—

యుద్ధ నౌకలకు తోడ్పడే విమానాలు కొన్ని ఉన్నాయి. యుద్ధనౌకలపైనే పెద్ద మైదానంవలె కప్పియుండు ఉక్కురేకుపైన యీ విమానాలు నివాసం ఉంటాయి. యుద్ధనౌకలు సముద్రంలో పోతూవుండగా దూరాన శత్రువులనౌక ఏదైన కనబడగానే, యీ విమానాలు స్టీమరుపైనుండే అకస్మాతుగా గాలిలోకి ఎగిరి, శత్రునౌకపైన ఎగురుచు, దానిపై గురిచూచి ఒక టార్పెడోను వదులుతాయి. ఆ టార్పెడో దిగువనున్న స్టీమరుని కన్నంచేసి ముంచివేస్తుంది. ఈ సాధనం యిటీవల ఎక్కువ లాభకరంగా బ్రిటిషు నౌకాదళం వారిచే ఉపయోగింపబడుతున్నది.

గాలిలోనుండి టార్పెడోలు గురిచూసికొట్టడం బాంబులు వేయడంకన్నా ముందే కనిపెట్టబడింది. 1914 లో 14 అంగుళముల చుట్టుకొలతగల చిన్న టార్పెడో (సోడా సిలెండరువలె ఉంటుంది) మొట్టమొదట ఉపయోగించబడింది. 1915 లో ఒక టర్కీ స్టీమరు యిటువంటి టార్పెడోతో ముంచివేయబడింది. తరువాత యీ ఆయుధం ఎన్నో రీతుల అభివృద్ధిచేయబడింది. ఈ యుద్ధంలో నార్వేపై బ్రిటిషువారు దాడిచేసినపుడు విమానాలనుండి టార్పెడోలువేయుట ప్రారంభించిరి. తరువాత ఆఫ్రికాతీరంలో డేకరు రేవునందు ఫ్రెంచి నౌకాదళంపైని ఉపయోగించేరు. ఈ రెండు తీరాన మూడు జర్మను స్వల్ప స్టీమరులు యిట్టి టార్పెడోలచేత ముంచబడ్డాయి.

మధ్యధరా సముద్రమునందు ఇటలీ కొసనున్న టారెంటో రేవు చేరువను, గ్రీసు చేరువను మటపంవద్దను ఇటలీ నౌకాదళానికి బ్రిటిషు నౌకలకును జరిగిన యుద్ధాలలో విమానాల టార్పెడోలు శత్రువులకు చాల నష్టంకలిగించేయి. ఆరు పెద్ద యుద్ధనౌకలును, రెండు చిన్న స్టీమరులును ఒక పౌర్ణమి నాడు రాత్రి ముంచబడ్డాయి. టార్పెడోలను ఉపయోగించు విమానాలు సొరచేపల్లాగ సన్నగా వుంటాయి కనుక వాటిని "సోర్డుఫిషు" అంటారు. అట్టి విమానాలు రెండు మాత్రం ఆ యుద్ధంలో పోయినాయి.

"భిస్మార్కు" అను జర్మను యుద్ధనౌక బ్రిటిషువారికి చాల నష్టం కలుగజేసింది. దానిని బ్రిటిషు నౌకలు చాల దూరంవరకు వెంటాడి, ముంచివేయడం "సోర్డుఫిషు" అను విమానాలు వేసిన టార్పెడోలవల్లనే జరిగింది. "ఆర్కురాయలు" అను బ్రిటిషు యుద్ధనౌక విమానాలను మోసుకపోయే పెద్ద నౌక. "విక్టోరియాసు" అను వేరొక విమానాలు మోసే స్టీమరున్నది. ఈ రెండింటిపైనున్న విమానాలే "బిస్మార్కు రును" ముంచినవి.

### బాంబులకన్న ఎక్కువ ఉపయోగం.

విమానాలనుండి బాంబులువేయడం సామాన్యంగా జరుగుతూ వుంటుంది. ఈ బాంబులు వేయడంకన్న టార్పెడోలు వేయడంవలన ఎక్కువ ప్రయోజనం వుంటున్నది. బాంబులకన్న టార్పెడోలు వేయుటకు గురిచూడ్డం సులభం. అన్నిరకాల స్టీమరులను టార్పెడోలు ధ్వంసచేయగలవు. దిగువ స్టీమరులయందుండు విమానవిధ్వంసక ఫిరంగులను టార్పెడోలు వేయు విమానాలు సులభంగా తప్పించుకోగలవు.

అంతేకాక టార్పెడో విమానాలు స్టీమరులపైనే మోసుకపోబడుతూవుంటాయి కనుక, ఎటువంటి గాలివానవున్న అవి ప్రయాణంచేసి రావలసిన దూరం తక్కువే కనుకను, వాటి వెంట విమానాలుకూడా ప్రయాణం చేస్తూనే వుంటాయి గనుకను, అవి సులభంగా ఎగిరి దిగగలవు. వాటిని మోసుకపోయే యుద్ధ విమానాలే దిగువనుండి ఫిరంగులు ప్రేల్చుచు ఆ విమానాలను శత్రు విమానాలనుండి రక్షించగలవు. బాంబులు వేసే విమానాలు అట్లాగాక, నేలనుకాని దిగలేవు. వాటివెంటా ఫైటరు విమానాలు ఉండాలి. నౌకా యుద్ధమునందు యిటువంటి టార్పెడో విమానాలయొక్కయు, వాటిని మోసుకపోయే యుద్ధ నౌకలయొక్క ఉపయోగం ఎక్కువగా రుజువైనది

టార్పెడోలను పడవేయగల విమానాలు నేలను దిగేవికూడా వున్నాయి. అవి చాలదూరం ఎక్కువవడిగా ప్రయాణంచేయుటకు వీలుగా నాల్గు ఇంజనులతో పెద్దవిగా కట్టబడ్డాయి. స్టీమరుపై దిగే టార్పెడో విమానాలలో "సోర్డుఫిషు" కాక "ఆల్బకోరు" అను యింకోరకం గలవు. అవి ఒకే యింజను, మడత రెక్కలు కలిగివుంటాయి. నేల దిగే టార్పెడో విమానాలను "బ్యూఫోర్టు" లంటారు. ఇవి సముద్రతీరాలందుండి శత్రు నౌకలు రాకుండా వారించుటకు ఎక్కువ తోడ్పడుతున్నాయి.

---

# భారతీయసేనల ప్రశంస.

## యుద్ధానికి హైదరాబాదు నైజాంగారి సహాయం.

## ఇండియా మంత్రి ఉపన్యాసం-కార్యదర్శి ప్రకటన.

హైదరాబాదు నవాబుగారు బ్రిటిషుప్రభుత్వానికి "విశ్వసనీయుడగు మిత్రుడు" అను బిరుదును గత యుద్ధంలో పొందేరు. వీరు యీ యుద్ధంలో బ్రిటిషు నౌకాదళానికి చాల ధనసహాయంచేసేరు. నీటిలో కనబడకుండా తిరిగి స్టీమరులను ముంచే సబుమైరైనులను నాశనంచేయడానికని 100,000 సవరనులను నైజాంగారు బ్రిటిషు ప్రభుత్వానికి యిచ్చేరు. ఆడబ్బుతో ముందుగ కట్టబడిన ఒక స్టీమరుకి పేరుపెడుతూ, ఇండియా మంత్రి ఎల్. ఎస్. అమెరీగారు అబిర్డీను రేవునందు ఉపన్యాసం చేసేరు. ఆ ఉపన్యాసంలో నైజాంగారికి బ్రిటిషు ప్రభుత్వానికి రెండువందలేండ్లనుండి సఖ్యతగలదనియు, వారి స్నేహాన్ని రుజువుచేయుటకే యీ యుద్ధంలోకూడ అన్ని యత్నాలకు నైజాముగారు తోడ్పడుచున్నారనియు అమెరీగారు పొగిడేరు. నైజాంగారు ఢిల్లీలోను, బొంబాయిలోను వున్న తమ పెద్ద రాజభవనాలను యుద్ధకార్యాలకు ఉపయోగించడానికి ప్రభుత్వానికి యిచ్చేరనియు, హైదరాబాదు పేరుతో ఒక విమానదళం యేర్పాటు చేయడానికి 150,000 సవరనెలు యిచ్చేరనిగూడ అమెరీగారు చెప్పేరు.

### రెండు రాధారులమధ్యవుంది ఇండియా.

తరువాత అమెరిగారు ఇండియాదేశంగురించి తెల్పుచు, బ్రిటిషు సామ్రాజ్యాన్ని రెండు భాగాలుగా విభజించితే ఇంగ్లాండు, యూరోపు, ఆఫ్రికా పడమర భాగములు, అట్లాంటికు మహాసముద్రంచుట్టు ఉన్న దేశాలు ఒకభాగంగా నుండుననియు ఆఫ్రికా దక్షిణకొననున్న కేపుటవునునుండి తూర్పున పశిఫికు సముద్రంలోనున్న న్యూజిలండువరకు హిందూ మహాసముద్రం చుట్టుఉన్న దేశాలొకభాగంగా నుంటుందనియు చెప్పేరు. ఈ సామ్రాజ్యంలో పడమరను సూయజు కాల్వ ద్వారాయున్న సముద్రమార్గమునకును, తూర్పున పశిఫికుసముద్రమునుండి వచ్చే సింగపూరు చేరువగ నున్న సముద్ర మార్గమునకు, రెండింటికి మధ్యగా ఇండియా వుందన్నారు ఈ రెండు రాధారులను ఇండియా రక్షించగల మధ్యస్థానంలో ఉందన్నారు. ఈ నౌకామార్గాలను రక్షించుటకు నౌకాబలం ఎక్కువ వుండాలి. నౌకాబలమే బ్రిటిషు సామ్రాజ్యాన్ని రక్షించగలదు. అట్టి నౌకాబలం వృద్ధిచేయడానికి జరిగే పనులన్ని పొగడతగినవే అన్నారు, అమెరీగారు.

### భారతీయ సైన్యాల గొప్పదనం.

ఈజిప్టు, సూడాను దేశాలకు పోయి యుద్ధంలో పాటుబడిన భారతీయసేనలు మరువరాని ఖ్యాతిని సంపాదించేయని అమెరిగారు చెప్పేరు. ఆఫ్రికాలోని అబిసీనియా దేశాన్ని ఇటలీ ఐదేండ్ల క్రిందట ఆక్రమించెను. అందు ఉత్తర భాగాన్ని యిపుడు భారతీయ సేనలు ఆక్రమించి, ఇటలీ సైన్యాలను ఖైదుచేసినవి. తరువాత మే మాసంలో ఇరాకులో రషీదాలి జర్మను సేనలను రప్పించుటకు ఉద్దేశించి యుండగా ఇండియా సైనిక దళం ఒకటి అతివడిగా ఆ దేశంలో ప్రవేశించి, రషీదాలి చర్యలను అడ్డగించెను. అతడు ఆలోచించుటకుగూడ వ్యవధి యివ్వలేదు. ఈ భారతీయ సైన్యం సహాయంతో అక్కడవున్న కొద్దిపాటి బ్రిటిషు విమానదళం తిరుగుబాటు చేసిన రషీదాలి సైన్యాలను అణచివేయగల్గెను. అందుచే చేరువనున్న క్రీటుదీవి నుండి జర్మను విమానాలు ఇరాకులో సైన్యాలను దించలేక పోయెను. ఇరాకులో శత్రువులు లేకుండా భారతీయ సైనికులు చేయగల్గిరి. తరువాత సిరియాలోకూడ శత్రువులు లేకుండా భారతీయ సైన్యాల సహాయంతోనే చేయగల్గేము. ఇపుడా సైన్య బలంతోనే పెర్షియా ద్వారా రష్యాకు సహాయం చేయగలుగుతున్నామని అమెరిగారన్నారు. ఇరాను ద్వారా రష్యాకు ఆయుధాలు, యితర సామానులు పంపడానికి రాధారి మార్గాలు సరిచేయాలి. ఆ పనిలోకూడా ఇండియా చాలా సహాయం చేయగలదు.

ఇండియా వ్యవసాయం ఎక్కువగల దేశమే అయినా, గత రెండు తరాలలో పరిశ్రమలు బాగా అభివృద్ధి చెందేయి. ఈ యుద్ధంలో సైన్యాలకు కావలసిన మందుగుండు ఆయుధాలు ఎంతో ఎక్కువగ ఇండియాలో తయారవుతున్నాయి. యుద్ధ విజయానికి యివెంతయు తోడ్పడగలవు.

శాంతి సమయాలలో ఇండియాలో 1,50,000 సైన్యం వుంటుంది. ఇపుడా సైన్యం సుమారు పది లక్షల వరకు పెరుగుచుతున్నది. దినదినం యిది అభివృద్ధి చెందుచున్నది. భారతీయ నౌకా దళంకూడ రెండింతలు మూడింతలు పెరిగింది. నౌకా దళనాయకులగు భారతీయులు, నావికులును అట్లాంటిక్ సముద్రమునందు జరిగే నౌకా యుద్ధాలలో బాగా పోరాడుచున్నారు. భారతీయ విమాన దళంకూడా బాగా వృద్ధియగుచు, యుద్ధంలో ఘన కార్యాలు చేస్తున్నదని అమెరిగారు చెప్పేరు.

### భారత సేనల సంతృప్తి.

సి. ఎం. జి. ఓగిల్విగారు ఇండియా ప్రభుత్వంలో, దేశ రక్షణశాఖ కార్యదర్శిగానున్నారు. వీరు యిపుడు ఈజిప్టు-లిబియా మున్నగు మధ్యధరా సముద్ర ప్రాంతంలోవున్న దేశాలలో తిరుగుచున్నారు. అచటనున్న భారతీయ సైన్యాలనుగురించి వారు యిట్లు చెప్పేరు:—

ఇచట బ్రిటిషు సైన్యాలన్ని చాల సంతృప్తిచెంది ఉన్నాయి. తరచు వార్తలలోకి ఎక్కకుండా మరుగుపడియుండు చిన్న సైనిక దళాలను కూడా నేను చూచేను. వారును తమ పనులను చాల సంతోషంతో గర్వంతో చేస్తున్నారు. క్రొత్త ఫిరంగి ఏదయినా "టామీగన్ను" వంటిది వచ్చేసరికి వారంతా మురిసిపోతారు. పగలంతా పరీక్షించి దాన్ని వుపయోగించే విధం తెలుసుకుంటారు. రాత్రి దాన్నిగురించి కలలు కంటారు. ఇటువంటి క్రొత్త ఆయుధాలు వారికెన్నో సప్లై చేయబడుతున్నాయి.

నేను చూచిన కొందరు భారతీయ సైనికులు టోబ్రుకులో ఐదు నెలలుండి వచ్చినవారు. యీ టోబ్రుకు శత్రువులచే ఎన్నో నెలలనుండి ముట్టడి చేయబడిన లిబియాలోని రేవు స్థలం. అచట వీరు ఆస్ట్రేలియా సైనికులతో అత్యంత స్నేహంగా వున్నారు. మళ్లా వారి భాషైనా వీరికి తెలియదు. టోబ్రుకులో భారతీయ సిపాయీలకు ఆస్ట్రేలియా సోల్జరులతో కలిసిన స్నేహం ఎన్నేండ్లవరకో నిలిచియుండగలదు.

ఈజిప్టు భారతీయులకు చాల అనుకూలమైన స్థలం. ఈజిప్టులో వారు జబ్బులు పడరు. ఆస్పత్రిలో చేరితే కారు ప్రమాదాలు యితర ప్రమాదాలవల్లనే చేరుతూ వుంటారు. అచట నొక ఆస్పత్రికి అధికారిగా భారతీయుడగు మేజరు హైదరాబాదులోనున్న వైద్యుడున్నాడు. అతను హాకీ బాగా ఆడగలడు. రోగులు నయమైనాకానే అందరు హాకీ ఆడుకుంటూ వుంటారు. భారతీయ సిపాయీలకు గ్రామఫోనులు, రేడియోలు, సిగరెట్లు అన్ని సమృద్ధిగా యివ్వబడుచున్నవి. ఇండియానుండి వుత్తరాలు విమానాలమీద వచ్చిపోతూవుండడం వారికెంతో సరదాగా వుంది. ఇతర సైన్యాలకన్న భారతీయ సైనికులు ఎక్కువ వుత్తరాలు వ్రాస్తారు. వారికిపుడు సెలవులుకూడ ఎక్కువగ యిచ్చుటకు ఏర్పాటులు జరుగుతున్నాయి. భారతీయ సైనికులు అందరిచే ప్రశంసింపబడుతున్నారు. అని ఓగిల్విగారు చెప్పేరు.

లిబియా-ఈజిప్టు ప్రాంతములలో పనిచేయుచున్న భారతీయ సేనలు యీ విధంగా అందరిచేత పొగడబడుచు, భారతదేశానికి ఖ్యాతి తెచ్చుచున్నవి. అంతేకాక వీటి ధైర్యం, సాహసం శత్రువుల ప్రకటనలలో కూడ ప్రశంసింపబడినట్లు యిటీవల వార్తలు వచ్చాయి.

## ఒక జర్మనుకి 50 మంది ఫ్రెంచివారు.

### జర్మనీ ఆక్రమించిన ఫ్రాన్సులో హత్యలు—ప్రతిక్రియలు

### జర్మను ఉద్యోగుల అత్యాచారాలను ప్రపంచమంతా నిరసించుట.

ఫ్రాంసు దేశంలో ఉత్తరభాగమును జర్మనీ ఆక్రమించి ఏడాదిపైనయింది. ఈ భాగంలో ఉన్న ఫ్రెంచివారికి జర్మనులన్నా, జర్మనీ ఉద్యోగులు అధికారులన్నా ద్వేషం అసూయ రోజురోజుకు హెచ్చుతున్నది. నాంటిసు, బోర్డో అను రెండు పూర్లలో యిరువురు జర్మను ఉద్యోగులు ఫ్రెంచివారిచే హత్య చేయబడ్డారు. అందుకని యీ హత్యకు బదు

లుగా 100 మంది ఫ్రెంచి బందీలను చంపేస్తానని జర్మను సేనానాయకుడు ప్రకటించెను. విషీ ప్రభుత్వము వలదని విన్నవించెను. ప్రపంచంలో అన్నిమూలలనుండి యీ దారుణచర్య ఖండించబడెను. అందుచే, జర్మను సేనానాయకుడు తన ఉత్తరువును వెంటనే అమలుజరుపక వాయిదావేసెను. ఈలోగా జర్మనులను హత్యచేసిన వారిని గూర్చిన ఆచోకీ తెలియాలని, అపూర్లలో ఫ్రెంచివారు హంతకుల సమాచారం తెలపాలని కోరేడు. ఈ సేనాని ఎపుడు తన ఉత్తరువును అమలు జరిపి నూరుమంది ఫ్రెంచివారిని ఉరితీసేస్తాడో చెప్పలేము. తమ గౌరవం పోతుందని జర్మనులు భయపడ్డపుడు ఎంత క్రూర కార్యాలైనా చేయడానికి జంకరు. హిట్లరు అధికారానికి రాగానే తన రాజకీయ ప్రత్యర్థులను వారి మిత్రులను ఎందరినో చంపివేసెను. ఆవిషయం ప్రపంచంలో అందరికి తెలిసినా, ఒక జర్మను ఉద్యోగికోసం 50 మంది ఫ్రెంచి వారి చొప్పున చంపడం చాల అన్యాయమని అందరు ఆశ్చర్యపోతున్నారు.

జర్మనీ రష్యాపై దాడి ప్రారంభించినాక ఫ్రెంచివారికి జర్మనులపై ద్వేషం మరింత హెచ్చింది. జర్మను ఉద్యోగులను ఎక్కువమందిని చంపడం ప్రారంభించేరు. దీని అర్థం ఏమిటి? ఫ్రెంచినాయకులు ఒకరిద్దరు జర్మనుల పక్షం తిరిగినా, ఫ్రెంచిప్రజల దేశభక్తి పోలేదని, ఫ్రాంసు ఆత్మ నశించలేదని తెలియగలదు.

యుగోస్లావియాలో యీ నెల 18 వ తేదిన జర్మను సిపాయిలను కొట్టిరను నెపమున, నిర్బంధమునందున్న 200 మంది స్లావు దేశీయులు తుపాకులతో కాల్చి చంపబడిరి. ఇటువంటి దారుణ చర్యలవలన దేశీయులకు జర్మను అధికారులపై ద్వేషం మరింత హెచ్చునేకాని తగ్గదు. పగ సాధించుట, హింసలతో కూడిన ప్రతిక్రియ నాగరికులు చేసే పనులు కావు. స్వాతంత్ర్యము కోల్పోయి, న్యాయ రక్షణ లేని ప్రజలకు పగ మరింత ఎక్కువగును కాని తగ్గదు.

### నాయకుల నిరసనము.

తమ వాడొకడు చస్తే పైవారు 50 మందిని చంపే అడవి మృగాల న్యాయమును అందరు నిరశించేరు. విషీప్రభుత్వాధ్యక్షుడగు మార్షెలు పితేనుగారు నిర్బంధంలో ఉన్న అమాయకులను చంపవద్దనియు, హంతకుల సమాచారం తెలిసే వరకు తననే బందీగానుంచుకోమనియు జర్మనీని కోరేడట. జర్మనులిట్టి ప్రతిక్రియ హత్యలు చేయరాదని జర్మనీకి అనుకూలుడగు ఫ్రెంచి నాయకుడు డార్లనుకూడ విన్నవించేడు. స్వతంత్ర ఫ్రెంచి నాయకుడగు జనరలు డిగాలిగారు, తన దేశీయులు జర్మనులను యిపుడు చంపరాదనియు, ఎపుడు వారిని ఎదిరించి చంపాలో ఉత్తరువు చేసేవరకు వేచియుండవలెననియు హెచ్చరించేడు.

క్రైస్తవ మత గురువగు పోపుగారును, అమెరికా అధ్యక్షుడు రూజువెల్టుగారు, బ్రిటిషు ప్రధానియగు చర్చిలుగారు కూడా బందీలను చంపరాదని గట్టిగా నిరసించేరు.

“ జర్మనులు తాత్కాలికంగా ఆక్రమించిన దేశాలలో నిర్బంధితులను హింసా ప్రతిక్రియకై వందలు వందలుగా చంపుచుండుట ప్రపంచమంతకు విడ్డూర్యంగావుంది. ఇతరుల చర్యలకై ఎవరిని చంపరాదని నాగరిక ప్రపంచమిదివరకే యెంతకాలం క్రిందటో నిర్ణయించెను. నేరంచేసినవాడెవడో తెలుసుకోలేక, నాజీ అధికారులు 50 లేక 100 మంది అమాయకులను చంపేస్తున్నారు. ఇకముందు హిట్లరుతో రాజీగోరి సంప్రదించువారు యీ చర్యలను మరువజాలరు. దౌర్జన్యంవలన దేశీయ పౌరుషం చంపలేమని గత యుద్ధంలోనే జర్మనులు నేర్చుకొనవలసియుండెను. ఇపుడు జర్మనులు అమలు జరుపుచున్న క్రొత్త విధానంలో వారిదారుణ చర్యలను వారే మించిపోతున్నారు. భీభత్సం కల్గించుటచే యూరోపులో ఎన్నడు శాంతికుదురదు. అందువలన ద్వేషం, పగ మరింత ఎక్కువగును ” అని రూజువెల్టు గారనిరి.

చర్చిలుగారు బ్రిటిషు ప్రభుత్వం తరఫున యీ భావాలన్నింటిని బలపరచిరి. ఫ్రాంసు, పోలండు, యూగోస్లావియా, నార్వే, హాలెండు, బెల్జియం దేశాలలోను, రష్యాలో గెల్చిన భాగాలలోను జర్మనులు చేస్తున్న యీ ఘోరమగు హింసలు మానవచరిత్రమునందెన్నడు కనివిని ఎరుగమనిరి. హిట్లరుకు అధికారమేపుంతే బ్రిటను అమెరికా ప్రజలను కూడా ఏమి చేస్తాడో దీనిబట్టి తెలుస్తుంది. ఈ నేరాలకు ప్రతిక్రియలు గైకొనుటగూడ యికముందు యుద్ధ ప్రయోజనాలలో చేర్చబడును అని చర్చిలుగారనిరి.

---

# అమెరికా అధ్యక్షుని ప్రకటన.

## హిట్లరు కుట్రలు బయల్పడ్డాయి.

## సముద్రమార్గాల రక్షణకు అమెరికా తయార్.

రూజువెల్టుగారు మళ్ళామాట్లాడేరు. వాషింగటను* నగరంలో గత మంగళవారం నాడు వారు చెప్పిందేమంటే, జర్మనులు అమెరికను నౌకలను వరుసగా ముంచినారు ; గుండు ముమ్ముందు ఎవరు ప్రేల్చేరో తెలిసిపోయింది. కాని సాధారణంగా ఆఖరు గుండు ఎవరు పేల్చుస్తారో వారు గెలుస్తారు. అమెరికన్లను భయపెట్టి, సముద్రమార్గాలనుండి అమెరికనులను ఖాళీ చేయించాలని హిట్లరు ఉద్దేశం. ఇదివరకే జర్మనీ యీ పని ప్రారంభించింది. కాని అమెరికా భయపడలేదు. ఆత్మరక్షణ, ఆత్మ గౌరవము, విశ్వాసమే అమెరికా ఆదర్శములు. సముద్ర మార్గాలు నిర్భయంగ అందరికి అందుబాటులో ఉండాలని అమెరికా కోరుతుంది. అందుచే హిట్లరు గీచిన గీటుదాటకుండా అమెరికను స్థిరులుండలేవు.

అమెరికా ఖండమును ఆక్రమించడానికి హిట్లరు ఎత్తులను గూర్చి రూజువెల్టు అధ్యక్షుడు రెండు క్రొత్త సంగతులు చెప్పెను. దక్షిణ అమెరికాను ఆక్రమించి ఎలాగముక్కలు చేసి హిట్లరు ప్రభుత్వం పరిపాలించదలచిందో తెలిపే మ్యాపు (దేశపటం) జర్మనీలో తయారయినది, తనకు చేరిందని రూజువెల్టుగారు చెప్పేరు. ఇపుడున్న 14 రాజ్యాలను ఐదు రాజ్యాలుగా హిట్లరు విభజించదలచెను. ఉత్తర దక్షిణ అమెరికాల మధ్యగవున్న పెనామారాష్ట్రంకూడ యిందు చేర్చబడింది. ఈ మ్యాపునుబట్టే జర్మనులు దక్షిణ అమెరికా మ్మాత్రమేగాక, అమెరికా సంయుక్తరాష్ట్రములను కూడ ఆక్రమించదలచిరని తెలియగలదు.

ఇపుడున్న మతాలన్నిటిని కిరస్తానం, మహమ్మదీయ మతం, హిందూమతం, బౌద్ధ, యూదమతము లన్నింటిని అణచివేయాలని జర్మనీ కుట్రచేస్తున్నట్లు తెలిపే రుజువు కాగితం వేరొకటి అమెరికా ప్రభుత్వానికి దొరికింది. క్రైస్తవ మతం గుర్తను క్రైస్తు శిలువబిళ్లలు, మున్నగు మత చిహ్న

# బ్రహ్మాండమగు ఫిరంగి.



“ బోకి బస్టరు ” దీనిపేరు ఇది ప్రపంచంలోకల్లా పెద్దది బ్రిటీషువారి ఆయుధాగారంలో క్రొత్తగ చేర్చబడింది బ్రిటీషువారి ఆయుధాలు అతివడిగ వృద్ధిపొందుతున్నాయి.

---

లన్నీ నిషేధింపబడును. మత ప్రచారకులు హిట్లరు కన్న దేముడు గొప్పవాడన్నారని వారంతా జెయిళ్లలో ఉంచబడుతారు. అన్ని దేశాలలో నాజీమత దేవాలయాలే స్థాపింపబడతాయి. మత గ్రంథాలకు బదులు హిట్లరు ఆత్మ కథ (మీనుకెంఫ్ గ్రంథం) చదవాలని నిర్బంధిస్తారు. క్రీస్తు బొమ్మకు బదులు స్వాస్తిక చిహ్నానికి కత్తికీ సలాం చేయాలి. ప్రేమ అపురూపాల్యాలుపోయి హింసచెలరేగును.

అమెరికా తీరంనుండి తుపాకి గుండు పోయినంతదూరానికి మించి యీ యుద్ధములో అమెరికా ప్రభుత్వం పోరాదని కొందరు అమెరికనులంటారు. వారికి జబాబుగ అధ్యక్షుడు హిట్లరు దాడి నిలిపేయాలని, తప్పక నిలువబడునని చెప్పెను. హిట్లరు తత్వం నాశనం చేయడానికి అమెరిక కంకణం కట్టుకుంది. అందుకై పోరాడుచున్నవారికి అన్ని విధములగు సహాయం అమెరికా చేస్తుందని. అమెరికాలో తయారగు ఆయుధాలు అమెరికాలోనే ఉండిపోవు. సముద్రంలో ముంచబడవు. యూరోపు దేశాలకు అందజేసే యేర్పాటులు చేస్తాము. అందుకు తగినట్లు అమెరికా చట్టాలు సవరింపబడును. అమెరిక కర్మాగారాలలో ఉత్పత్తి ఎక్కువగుతున్నది. కొద్దిమంది యజమానుల స్వార్థపరమను నిరోధంవలన ఆపని నిలిచిపోదని రూజువెల్టుగారన్నారు.

అమెరికా దేశరక్షణకార్యే తమ ప్రభుత్వం శ్రద్ధవహిస్తున్నదని, నౌకాదళం బాగా పెంచబడి యుద్ధానికి సిద్ధంగా వుందని, హిట్లరు కాలుకదప కుండా చేయడమే అమెరికా రక్షణవిధానమనియు, రూజువెల్టుగారు చెప్పేరు.

రష్యాకు టాంకులు, విమానాలు, ఫిరంగులు, వైద్య సామానులు అన్నీ కావాలి. ఇంగ్లండు, అమెరికాలు వాటిని ఎక్కువగా సప్లై చేస్తున్నాయి. తమ సైన్యాలకు తినన్ని ఉంచుకొని, ఇంగ్లాండుకి, రష్యాకు, చీనాకు ఎంతకావాలో అంత సప్లై చేయవలసిన పూచీ అమెరికా పరిశ్రమలపై గలదు. ఈ బాధ్యత నిర్వహించడములో వెనుతీయరాదని ప్రజలను అధ్యక్షుడు హెచ్చరించెను.

# ఈ వారం యుద్ధ వార్తలు.

## జర్మనీమీద విమానదాడులు.

జర్మనీమీద, జర్మనులు ఆక్రమించియున్న ఐరోపాలోని పడమటి దేశాలమీద విమానదాడులు సాగించడానికి, ఈ వారంలో వాతావరణం చాలా అనుకూలంగా వుంది. ఉత్తరాన నార్వేనుండి, దక్షిణాన స్పెయినువరకు జర్మనుల స్వాధీనంలోవున్న 2,000 మైళ్ల తీరంలోనూగల రేవులమీద నౌకాలయములమీద బ్రిటిషు విమానాలు పెద్దపెద్ద దాడులు సాగించి, ఆ రేవులను ధ్వంసం చేశాయి. రేవులలోవున్న నౌకలలో చాల భాగాన్ని ముంచివేశాయి. అంతటితో పూరకొనక జర్మనీలో పడమటిప్రాంతపు పట్నాలమీద భయంకరమైన విమానదాడులు సాగించి వేలకొలది ప్రేలుడుబాంబులను వర్షించాయి.

ఈదాడులలో 24 వ తేదీన సప్లయిలను తీసుకొని వెళ్లుచున్న ఒక పెద్ద జర్మను నౌక ఒకటి ముంచివేయబడింది. 25 తేదీన డచ్చితీరాన రెండు నౌకలు తగులబెట్టబడ్డాయి. 26 తేది రాత్రి వందలకొలది బ్రిటిషు విమానాలు, జర్మనీ పడమటిప్రాంతాన గల పెద్ద పారిశ్రామిక పట్టణమును రేవుపట్టణమును అగు హాంబర్గు నగరంమీద వేలకొలది బాంబులు వర్షించాయి. వానివలన చాల ఫాక్టరీలు పూర్తిగా తగులబడి ధ్వంసమైపోయాయి. ఆ రోజు దాడులలో 13 బ్రిటిషు విమానాలు తిరిగి రాలేదు. ఫ్రాన్సు ఉత్తరప్రాంతంలో రెండు జర్మనువిమానాలను పడగొట్టిరి.

శత్రువిమానలుగూడా రాత్రివేళల స్వల్పంగా బ్రిటను మీదదాడి సాగిస్తున్నాయి. కాని ఒక్కొక్కటిగామాత్రమే రావడంచేత, యెక్కువ నష్టం కల్గించలేక పోతున్నాయి. శనివారము రాత్రి వచ్చిన శత్రువిమానాలలో ఒక దానిని బ్రిటిషు విమానాలు పడగొట్టినవి.

## ఆఫ్రికా రంగాలలో శత్రులచికాకులు.

అబిసీనియాలో ఇంకా ఒక్క "గోండారీ" దుర్గప్రాంతంలోమాత్రమే కొన్ని వేల ఇటాలియను సైన్యం మిగిలివుంది. అబిసీనియా సైన్యాలు, బ్రిటిషు సైన్యాలు, వానిని చుట్టుముట్టి వున్నాయి. 26 వ తేదిన—బ్రిటిషు పదాతి సైన్యాలు, విమానాలు శత్రులమీదపడి చురుకుగా యెదిర్చాయి. శత్రులకు చాల నష్టంకల్గి వెనుకకు తగ్గినారు. ఒక ఇటాలియనువిమానాన్ని మన సైనికులు పడగొట్టారు.

లిబియా-ఈజిప్టు దేశాల సరిహద్దులలో, బ్రిటిషుసైన్యాలకూ, ఇటలీ-జర్మను సైన్యాలకూ, స్వల్పమగు సంఘర్షణలు మాత్రం రోజూ జరుగుతున్నాయి. కాని, శత్రులు ముందుకు రావడానికి ప్రయత్నించడంలేదు. అందుచే ఆ రంగంలో గట్టి పోరాటాలు ఏమీ జరుగలేదు.

లిబియా రాష్ట్రంలో (ఇటాలియనులది) టొబ్రూకు రేవు దుర్గమునందలి బ్రిటిషు సైన్యాలు, భారత సైనికులు—శత్రులమీదకు ప్రతి రోజూ దాడులు సాగిస్తూనేవున్నాయి. ఈ దుర్గాన్ని చుట్టుముట్టియున్న శత్రులు 25 వ తేదీన, తమ విమానాలనుపంపి, చాలసేపు దుర్గంమీద బాంబులు కురిపించారు. కాని ముందుగానే, బ్రిటిషు సైన్యాలు జాగ్రత్త పడటంచేత, దుర్గానికి ఏమాత్రం నష్టం కలుగలేదు.

ఈజిప్టు ప్రాంతమునుండి బ్రిటిషు విమానాలు బయలుదేరి, లిబియాలో ఇటాలియనుల స్వాధీనంలోవున్న బెంఘాజీ రేవుమీద, టొబ్రూకు రేవుమీద చాల బాంబులు వర్షించాయి. ఆ రేవులలో సప్లయిలను దింపుతున్న నౌకలలో చాల భాగం ముంచివేయబడ్డాయి.

## ఇటలీనగరాలమీద బ్రిటిషుదాడులు.

లిబియామీది దాడులతో పూరుకోకుండా బ్రిటిషు విమానాలీవారం, అసలు ఇటలీ దేశంలోని ప్రధానమైన పట్నాలమీదనే దాడులను అధికంచేశాయి. ఇటలీలో "నేపిల్సు" అనే పెద్దపట్నం, అనాదిగా ప్రపంచఖ్యాతి చెందినది, ఆరు రోజులుగా బ్రిటిషు విమానాలు రాత్రులలో, ఈపట్నంమీదకు దాడి సాగిస్తూ వేలకొలది బాంబులు వర్షిస్తున్నాయి. నగరంలో చాల భాగం శిథిలమై నిర్మూలమైపోయింది.

## రోజుకు ఒక ఇటాలియను నౌక బలి.

ఇటలీకి—ఆఫ్రికా తీరానికి మధ్యవున్న సముద్రప్రాంతంలో, బ్రిటిషు విమానాలుగాని, నౌకలుగాని, జలాంతర్గాములు, రోజు ఒక్కటికి తక్కువకాకుండా ఇటాలియను సప్లయి నౌకలను యుద్ధనౌకలనూ ముంచివేస్తున్నాయని— మధ్యధరా ప్రాంతంలో బ్రిటిషు నౌకాదళ సేనానియగు అడ్మిరల్ సర్ ఆండ్రూ కన్నింగుహాంగారు ప్రకటించారు.

## ఇరాక్ మిత్రమండలిలో కలుస్తుంది.

ఇరాక్ దేశంలో క్రొత్తరాజు (షా) క్రమంగా, ప్రజల అభిమానాన్ని, ఆదరణాన్ని పొందుతున్నాడు. చాల రాజకీయ సంస్కరణలను ప్రవేశపెట్టి ప్రజా ప్రతినిధులకు యెక్కువ అధికారాలు ఇస్తున్నాడు. క్రొత్తరాజు వచ్చిన తరువాత, దేశీయ వ్యవహారాలలోనేకాక, విదేశాలతో సంబంధాలలోనూగూడ చాల మార్పుగలుగుతున్నది, వెనుకటిరాజు జర్మనుల యెడల అభిమానంగావుండేవాడు. క్రొత్త రాజు ఇంతవరకు తటస్థంగా వుంటున్నాడు. కాని ఇపుడు బ్రిటనుతోను, రష్యాతోనూ కలసి, బ్రిటిషు మిత్రమండలిలో చేరడానికి కూడా సిద్ధమగుతున్నాడు. ఇరాక్ మిత్రమండలిలోచేరుటకు ఇదివరకె సంప్రదింపులు జరిగాయని ఒడంబడిక షరతులనుగూడ ఇదివరకే నిర్ణయించుకొన్నారనీ, త్వరలోనే ఒడంబడికపై సంతకములుగూడ జరుగుననీ బ్రిటిషు విదేశాంగమంత్రియగు ఈడెన్‌గారు, 25 వ తేదీన పార్లమెంటులో వెల్లడించాడు. రష్యనులు, ఇరాక్‌లోవున్న తమ సైన్యాలను మరల్చుకొని రష్యాలోని దక్షిణ రాష్ట్రమును రక్షించుకోవడంకోసం, కాకేసియాకు పంపించారనీ ఇటీవల వదంతులు వ్యాపించాయి. కాని అది అబద్ధం. రష్యను అధికారులు తమ సైన్యాలను, ఇరాక్ రాజధానియగు టెహరాన్ నగరమునుండి మరల్చుకొని, ఆ దేశంలోని వుత్తర జిల్లాలలో నిలిపియుంచారు. అని రష్యను అధికారులు ప్రకటించారు.

## ఫ్రాన్సులో జర్మను ఘోరకృత్యాలు.

ఫ్రాన్సులో జర్మను సైన్యములు ఆక్రమించియున్న ప్రాంతాలలో గతవారం, ఎవరో ఇద్దరు జర్మను సైనికాధికారులను హత్యచేసిరి. దానికి ప్రతీకారంగా జర్మను అధికారులు—తమవద్ద ఖైదులోవున్న 100 మంది ఫ్రెంచి ప్రముఖులను—తుపాకులతో ప్రేల్చి చంపివేశారు. హంతకులను పట్టి ఇవ్వనియెడల మరి 100 మందిని చంపెదమని బెదరించిరి. జర్మను సైనికాధికారుల హత్య చేయడంవలన లాభం లేదనీ—దానికి ఫలితంగా వందలకొలది నిరపరాధులగు ఫ్రెంచి ప్రజలు మరణమునకు గురియగుచున్నారనీ, విషీ (ఫ్రెంచి) ప్రభుత్వనాయకుడగు పెటెయిను సేనాని విజ్ఞప్తి చేశాడు. ఇటువంటి నేరాలు చేసేవారు కఠినముగ శిక్షింపబడుదురని ప్రకటించారు.

హంతకులను వదలివేసి నిరపరాధులగువారి నీవిధంగా చంపుట రాక్షసకృత్యమని "చెక్" దేశపు ప్రభుత్వం జర్మను ప్రభుత్వానికి అసమ్మతి తెలిపింది. ప్రపంచంలో అన్ని దేశములలోని పత్రికలు జర్మను దురన్యాయాలను ఖండించాయి.

పిమ్మట జర్మను సైనికాధికారులు తాము చంపదలచిన "రెండవ వంద" ఖైదీలపైన—మరణపు వుత్తరువును అమలు జరుపుటను తాత్కాలికంగా నిలుపుదలచేసినట్లు విషీ ప్రభుత్వానికి 27 వ తేదిన తెలియజేశారు.

### టర్కీ భయాలు.

ఇటలీ-జర్మను రాజ్యాలు తూర్పు దేశాలమీదకు దాడి సాగించడానికి—టర్కీ దేశమే మధ్య అడ్డంగా వుంది. టర్కీపై దాడి సాగించడానికి హిట్లరు సంకోచిస్తున్నాడు.

అయినా టర్కీ నాయకులు తమ దేశానికి యేర్పడనున్న ప్రమాదాన్ని గుర్తింపక పోలేదు. టర్కీ అధ్యక్షుడగు ఇనూనూగారు జాతీయోత్సవాల సందర్భంలో 28 వ తేదిన టర్కీ ప్రజలకు సందేశమంపుచూ "టర్కీకి, అపాయం ఇంకా యేమాత్రం తగ్గలేదు. వ్యవహారాలు గాఢాంధకార బంధురంగా వున్నాయి. అయితే టర్కీ సైనికబలం దిన దిన ప్రవర్ధమానమై అజేయమగుచున్నది. ఆ సైనికబలం టర్కీ స్వాతంత్ర్యాన్ని రక్షించగలదనే సంపూర్ణ విశ్వాసం నాకు గలదు" అని ప్రకటించాడు.

### రష్యాయుద్ధం-జర్మనులకు అపార నష్టం.

రష్యా యుద్ధం మరీ భయంకరమగుతున్నది. ఉత్తరపు కొనవద్ద ఫిన్లండు సైన్యాలకు-రష్యను సైన్యాలకు జరుగుచున్న పోరాటంలో యెక్కువ మార్పులు లేవు. కాని, దానికి కొంచెం దక్షిణంగా లెనిన్‌గ్రాడువద్ద జరుగుచున్న యుద్ధం ఈవారం మళ్ళీ తీవ్రమైనది. కొన్ని రోజులుగా జర్మను సైన్యాలు ఇచటి-పట్టణాన్ని పట్టుకోడానికి పెద్ద యుద్ధాలను దలపెట్టటం లేదు. మొన్న ఆకస్మికంగా దాడులు ప్రారంభించారు కాని ఫలితం లేకపోయింది. రష్యా సైన్యాలు శత్రు దాడులనన్నిటినీ తిరుగగొట్టి ఇదివరకటికంటె పట్టణానికి చాలదూరము తరిమెను. అక్కడ నాలుగు రోజులు జరిగిన పోరాటంలో హతులైన జర్మనులు దెబ్బలు తగిలినవారు 37,000 లకు తక్కువ యుండదని ప్రకటింపబడెను.

మధ్యరంగమున-రష్యా రాజధానియగు మాస్కో నగరమును పట్టుకొనుటకు జర్మనులు బ్రహ్మాండమగు ప్రయత్నం చేస్తున్నారు. కాని ఉత్తరం వైపుగా మాస్కో నగరం మీదికి వస్తున్న జర్మను సైన్యాలు 17 రోజులక్రింద యెక్కడ నున్నవో ఇపుడును అక్కడనేయున్నవి. మాస్కోకు 100 మైళ్ల దూరానవున్న కలినిన్ నగరంలో ఉభయ పక్షాలకు ఇంకా బ్రహ్మాండమగు యుద్ధం జరుగుతునేవున్నది. మాస్కోకు పడమటను మొజయిస్కు (మాస్కోకు 60 మైళ్లు) వద్దనే రోజూ ఇంకా పోరాటాలు జరుగుతున్నయి. దక్షిణాన ఓరెలు పట్టణమునుండి గడచిన 14 రోజులలోను శత్రులు ముందుకు సాగగలుగలేదు. రష్యా ప్రధాన మంత్రియగు "స్టాలిన్" మాస్కో నగరమునందలి సైన్యములకు-"ప్రాణము లున్నంతవరకూ పోరాడుతోనేవుండాలి, ఒక అడుగైనా వెనుక వేయరాదు" అని వుత్తరువు చేశాడు.

దక్షిణమున తూర్పు యుక్రేన్‌లో మాత్రం శత్రువులు కొంచెం ముందుకు రాగలిగారు. ఆ ప్రాంతంలో పెద్ద పరిశ్రామిక పట్టణమగు స్టాలినో నగరాన్ని ఖాళీచేసితిమని రష్యనులు ప్రకటించిరి. స్టాలినో నగరాన్నేగాక, తూర్పు యుక్రేన్ రాజధానియగు కార్కొవు నగరాన్ని దానికి ఈశాన్యంగావున్న బెల్గొరోడ్డు పట్టణాన్నిగూడ 24 వ తేదిన ఆక్రమించితిమని జర్మనులు ప్రకటించిరి.

కార్కొవువద్ద ఇంకను పోరాటము జరుగుచున్నదనీ 28 వ తేదినే తాము ఖాళీచేసితిమనీ రష్యనులు ప్రకటించారు. యుక్రేన్‌కు-కాకేసియా రాష్ట్రానికి సరిహద్దులలోవున్న "గోసావ్" అనే పెద్ద పారిశ్రామిక పట్నంవద్దగూడ భయంకరమైన పోరాటం జరుగుచున్నది. కాకేసియాకు "రోస్టావ్" పట్నం సింహంద్వారంవంటిది. ఇంతవరకు మాస్కో రంగంలో శత్రులను చిక్కుపెట్టుచున్న టిమోషెంకో సేనానిని ఈ వారం దక్షిణ రంగమునకు మార్చిరి. దక్షిణ రంగంలో ఇంతవరకుంటున్న బుడెనీ సేనానిని ఉత్తర రంగంలో వుంటున్న వరోషిలావ్ సేనానిని, కొత్త సైన్యాలను తయారుచేయుటకోసం దేశంలోనికి పంపిరి.

మరీ దక్షిణాన క్రిమియాలోగూడ జర్మనులు రష్యను సైన్యములను చొచ్చుకొని పోవుటకు చాల ప్రయత్నములొనర్చిరి. కాని ఫలితం లేకపోయినది. 28 వ తేదిని రష్యను పంక్తుల భేదించుకొని క్రిమియాను ప్రవేశించితిమని జర్మనులు ప్రకటించుకున్నారు.

### అమెరికా - యుద్ధానికి సిద్ధంగావుంది.

అమెరికా సంయుక్త రాష్ట్రాల శాసన సభలు రెండును, జర్మనీ, ఇటలీలను యెదిర్చి పోరాడుచున్న దేశాలన్నిటికీ ఆయుధ సామగ్రిని సప్లై చేయుటకోసం మరి 600 కోట్ల డాలరుల సొమ్మును వెచ్చించవచ్చును అను చట్టమును తుది సారి ఆమోదించాయి. రష్యాకుగాని, మరేయితర దేశానికి ఈచట్టం క్రింద సహాయం పంపరాదనే షరతువిమీ, చట్టంలోలేదు. అటువంటి సవరణను శాసనసభలు నిరాకరించినాయి.

అమెరికను వర్తకనౌకలన్నిటికీ, ఆత్మరక్షణకొరకు, ఆయుధాలు అమర్చవలెననే చట్టమును సెనెటు విదేశాంగస్థాయి సంఘమువారు ఆమోదించారు. అమెరికను నౌకలు—ఆయుధాల ధరించవచ్చుననేకాక—ప్రపంచంలో సముద్రం మీద ఏ ప్రాంతానికైన సరే ప్రయాణం చేయవచ్చునని అధికారమిస్తూ ఒక సవరణచేశారు. సవరణకు 13 రు అనుకూలంగాను, 10 మంది ప్రతికూలంగాను వోటుచేశారు.

గత 27 వ తేదిన అమెరికా నౌకాదళోత్సవములు జరిగినవి. ఆ రోజున రూజ్వెల్టు అధ్యక్షుడు ఉపన్యసిస్తూ, అమెరికా యుద్ధమున కిపుడు పూర్తిగ సిద్ధముగనున్నదని ప్రకటించాడు. హిట్లరు పద్ధతులను (జర్మనీ) ముస్సొలినీ (ఇటలీ) పద్ధతులను నిర్మూలం చేయడానికి అమెరికా కృతనిశ్చయమై వున్నదని హెచ్చరించాడు. జర్మనులు దక్షిణ అమెరికా రాష్ట్రాలను, మెక్సికో మొదలగు మధ్య అమెరికా రాష్ట్రాలను తన స్వాధీనంలోకి దెచ్చుకొని, వానిని అయిదారు రాష్ట్రాలుగా విభజించడానికి నిశ్చయించుకొన్నారనీ, దానికి సంబంధించిన ప్లానులు తనచే జిక్కినవనీకూడ, రూజ్వెల్టు అధ్యక్షుడు బయటపెట్టెను.

అమెరికా ఫాక్టరీలలో టాంకులు, ఫిరంగులు మొదలగు ఆయుధాలఉత్పత్తి, ఇదివరకటికంటె ఈవారం రెండింతలు హెచ్చిందని రూజ్వెల్టుగారు వెల్లడించారు.

### జపాను-అమెరికాలకు యుద్ధమా ?.

ఇక తూర్పు దేశాలలోగూడ అలజడిగానే వుంది. జపాను ఏమి చేసనుందో ఇంకా తెలియుటలేదు. జపానువారి "మంచుకో" రాష్ట్రానికీ-తూర్పు రష్యాకు సరిహద్దులలో రష్యా సైన్యాలకూ, జపాను సైనికులకూ తిరిగి కలహాలు సంభవిస్తున్నాయి. మొన్న ఒక రోజున చాలమంది జపాను

సైనికులు సరిహద్దులు దాటి రష్యాలోకి చొచ్చుకొని వెళ్లారు. రష్యనులు వారినియెదిరించారు. కొంతసేపు ఉభయులకు పోరాటం జరిగిన తర్వాత జపాను సైనికులు చాల తుపాకులను మందుగుండును వదలిపెట్టి తమ సరిహద్దులోకి పారిపోయిరి.

దక్షిణాన, తాయి దేశపు సరి హద్దులలోగూడ అటువంటి సంఘర్షణలే జరుగుతున్నాయి. తాయి దేశానికి వుత్తర దేశమునవున్న ఇండో-చైనాలో చేర్చబడిన జపాను సైన్యాలు ఇంతవరకు తాయి దేశపు సరిహద్దుకు కొంతదూరంగా శిబిరాలు ఏర్పరుచుకొని వుంటున్నాయి. ఇపుడా సైన్యాలు, తాయి దేశపు సరిహద్దుల సమీపానికి చేరినవి. వారా సరిహద్దులనుండి తాయి దేశపు సరిహద్దులోవున్న తాయి పోలీసు ఠాణులమీద ఏదో నెపంతో తరుచు తుపాకులు పేలుస్తున్నారు. ఈ సరిహద్దు ప్రాంతానికి వెళ్లడం అపాయకరమని కనుక అచటికి సామాన్యంగా వెళ్ల వలదనీ తాయి అధికారులు తమ ప్రజలను హెచ్చరించారు.

చైనాలో జపాను సైనికాధికారులు దక్షిణానవున్న కాంటన్ నగరంవద్ద సైన్యాలను విశేషంగా చేర్చారు. అక్కడనుండి వుత్తర దిశగావున్న రైలు ప్రాంతాన్ని ఆక్రమిస్తే చైనాలోని తూర్పు భాగాన్నంతా స్వాధీనం చేసుకోవచ్చునని జపానీయులు తలుస్తున్నారని, చైనా అధికారులంటున్నారు. వీనిని ప్రతిఘటించడానికి చైనీయులుగూడా పెద్ద సైన్యాలను ఆ ప్రాంతాలకు పంపుతున్నారు.

ఇచాంగ్ అనే రేవుప్రదేశంవద్ద జరిగిన పోరాటంలో జపాను సైన్యాలు విమానాలు చైనీయులమీద విషవాయువును ప్రయోగించారనీ ఆ విషవాయు ఫలితంగా 1,300 మంది చైనా సైనికులు ఇంకా బాధపడుతున్నారనీ చైనా అధికారులు ప్రకటించారు.

జపానుకు-అమెరికాకు యుద్ధం తప్పదని, అమెరికా నౌకాదళాధికారియైన కర్నలు నాక్సుగారు అమెరికా ప్రజలను హెచ్చరించారు. జపానులో పట్టణాలలోను, పల్లెలలోను శత్రువిమానాలు దాడివచ్చి బాంబులువేస్తే యెట్లా తల దాచుకోవాలో ప్రజలకు నేర్పుచున్నారు. ఈ విధంగా నేర్పడం—జపానుకు యుద్ధంవచ్చునను నమ్మకంతో నేగాని-ఏదో లాంఛనార్థమైన కవాతు గాదని జపాను అధికారులు అంటున్నారు. తూర్పు దేశాలలో జపానుకు అమెరికా అడ్డు దగిలితే యుద్ధానికి జపానీయులు వెనుదీయరని జపాను అధికారులు ప్రకటిస్తున్నారు.

## మెక్సికో-మిత్రమండలిపైననే అభిమానం.

అమెరికాఖండంలో వున్న మెక్సికో దేశానికి ఆంగ్ల దేశానికీ చాలకాలంనుంచి రాజకీయసంబంధాలు లేవు. కొన్ని వివాదాలవలన పరస్పర సంబంధాలను వదలుకున్నవి. మెక్సికో ప్రభుత్వం ఇపుడు అక్షరాజ్యాల దురాక్రమణలను నిరోధించడంకోసం ఆంగ్ల-అమెరికా ప్రభుత్వాలతో చేరి పని చేస్తామని ప్రకటించారు. ఆ వాగ్దానం వచ్చిన తరువాత, బ్రిటిష్ప్రభుత్వం, తిరిగి మెక్సికోతో ఇపుడు రాజకీయ సంబంధాలను తిరిగి నెలకొల్పుకొనుటకు అంగీకరించింది.

---

సలహా : ఇకముందు చూచుకొనుటకు యీ మదరాసు యుద్ధ సంచికను మీరు భద్రపరచుకొనుడు.

[మదరాసు సమాచారముల ఆఫీసరుగారు తమ వందనములతో దీనిని మీకు పంపుచున్నారు.]

---

MADRAS : PRINTED BY THE SUPERINTENDENT, GOVERNMENT PRESS.